శ్రీరస్తు.

# దశావతారచరిత్రము

ధరణిదేవుల రామయమంత్రికృతము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము

*All Rights Reserved.*

1926




ఈ గ్రంథమును రచించిన కవి ధరణీదేవుల రామయమంత్రి. నియోగిబ్రాహ్మణుఁడు. ఈతనితాత తిమ్మయమంత్రి. తండ్రి నాగయమంత్రి. తల్లి ఫణియమ్మ. ఈ గ్రంథమునందు శ్రీమహావిష్ణుని దశావతారములును గూర్చినకథ చెప్పఁబడినది. పదియవతారముల కథను బదియాశ్వాసములలో నిమిడ్చినాఁడు. రామావతారకథ రెండాశ్వాసముల క్రిందను, బుద్ధకల్క్యవతారముల రెంటికథను నొక్కయాశ్వాసము క్రిందనుఁ జెప్పినాఁడు. రామావతారకథవంటి పెద్దదియైనను బలరామావతారకథను రెండాశ్వాసముల క్రింద రచియింపలేదు గాని, కృష్ణచరిత్రమును రెండవభాగముగా విభజించినట్లున్నది. ఈగ్రంథము మగదల కృష్ణమంత్రి కంకితము చేసినాఁడు. ఈకృష్ణమంత్రి నెల్లూరిమండలములోని ప్రాయకావేరిపట్టణములో గతశతాబ్దాంతమున దొలాందావారికి ద్విభాషిగా నుండెనని యాంధ్రకవుల చరిత్రమునఁ దెలియవచ్చుచున్నది. గత శతాబ్దాంతమనఁగా, నాంధ్రకవులచరిత్రమే 19-వ శతాబ్దాంతమందు రచియింపఁబడి యుండుటచేత 18-వ శతాబ్దాంత మనుకొనవలయును. మఱియుఁ బుష్పగిరి తిమ్మన్న, కంకంటి పాపరాజులు రామయమంత్రికి సమకాలికులైనట్లు తెల్పుచు వారివిషయము 1790 ప్రాంతముననని కవులచరిత్రము వ్రాయుటకూడ దీని కాధారము.

ఈరామమంత్రి సంస్కృతప్రాకృతాద్యష్టభాషలు నేర్చినవాఁడు. అట్టివానికిఁ దెనుఁగుకవిత్వము లెక్కలోనిదిగాదు. పూర్వకవులు సంస్కృతముతోపాటు స్వభాషను గూడఁ గృషి చేయుచుండెడివారు. పెద్దపెద్ద పండితులయొద్దఁ గాశి మొదలగుతావుల జదువుకొనివచ్చి (సంస్కృతమును) యింటికడ మాతృభాషను బరిశ్రమ చేయువారు కావచ్చును. కవులు చేయు గురుస్తుతి సంస్కృతవిద్యాభ్యాసము చేయించిన గురువులస్తుతియనియే తలఁపవచ్చును. ఈవిషయ మింతకంటె నిక్కడ నప్రస్తుతము. ఈకవి సంస్కృతమును దెనుఁగును చక్కఁగా గ్రంథము దంతటను వాడినాఁడు. సంస్కృతవాక్యములను దెనుఁగుపద్యములనడుమ "అద్యభవే త్తవ సర్వమంగళావాప్తిః" అటంచు నీరీతిగాను జేర్చును. పాణౌకృతి, నాభీసరోజుఁడు, దంభూతవామాంగుఁడు మొదలగుపదములఁ బ్రయోగించెను. తెనుఁగునను గూడ నపూర్వపదప్రయోగము గావించినాఁడు కాని యందందు, "అదేమే వైరిసేన్నైవు, నవ్వేరెవరైన, ఇంట్లోవారికి దుఃఖించ" ఇట్టి వ్యాకరణవిరుద్ధపదములు కలవు. లోకో

క్తులు జాతీయములు చక్కగా వాడినాఁడు. "ముక్కునగన్వగుట్టినిను ముందరగ నీడిచి-అబలలము మూఁడుమాటల నాల్గుతప్పులు." ఇట్టిసహజములును, "ఆయం భోజమ్ములఁ జూచి చెర్వ్యాజలవర్ణ్యంబులుబుఁ జల్లింతు గే" ఇట్టి స్వాతంత్ర్యములు నగు లోకోక్తులను బ్రయోగించినాఁడు. పాఠకులకు విదితము కాఁగలదని యిట విస్తరింపలేదు. సంస్కృతాంధ్రముల రెంట నీతని కవిత్వము, వర్ణనలు, కల్పనలు, మృదుమధురములు రసానుగుణములునుగా నుండును. స్వభావవర్ణముల నీతఁడు నెట్టినది సేరు. యమకములు, నంత్ర నియమములు, గర్భకవిత్వము, బంధకవిత్వముఁ జక్కగ నభ్యసించినవాఁడు. స్తుతిసమయములలోఁ బలుపురచేఁ బలువిధములఁ నాయారీతి గర్భబంధకవిత్వముం జెప్పించినాఁడు. పాఠకులు చిత్తగింతురు గాక! అదితిచేఁ బ్రాకృత సీసపద్యముతో విష్ణుస్తుతి చేయించి, స్త్రీ కావున నేమో ఇట్లప్రాకృతగుణాతీతయగు నదితి ప్రాకృతగుణాతీతుని (ప్రాకృతమున) వర్ణించినట్లు నుడివినాఁడు. ఆంజనేయునిచే శ్రీరాముని రత్నమాలికలో మంజుభాషిణి యను వృత్తముం గూర్చి స్తుతి చేయించి రామునిచే నానావిధకవిత్వమునకు మెప్పించి సీతచే ముత్యాలహారము నిప్పించినాఁడు. ఈతఁడే పక్షపాతము నసూయయులేని కవి. తానొక ప్రభున్నొద్దఁ గవిత్వము చెప్పి జాంబూనదాంబరమణి భూషణాదులం గొనుకవి తనవంటి కవులకును బ్రభుసంస్థానములలోఁ జెప్పయిప్పించిననేగదా కీర్తికలుగును. చక్కని తెనుఁగుప్రాకృతము సంస్కృతముపదములే కాక అన్నగళు (అఱవము) చినరాయపట్టను (కన్నడము) సాహేబూ (హిందుస్తానీ) పదములనుగూడ వాడినాఁడు.

శృంగారవర్ణనములకుఁ గడఁగెనా యీతని కొఁడలు తెలియవనుట సాహసము కాఁగూడదు. బాలురగు రామలక్ష్మణులయొద్ద విశ్వామిత్రునిచేత నహల్యచరిత్రమును బచ్చిపచ్చిగా వర్ణింపించినాఁడు. ఇంద్రునిచేష్టలు మానవసామాన్యముగా నున్న వనిపించినాఁడు. కృష్ణుఁడు, గోపికలు, వీరలవిషయము చెప్ప నక్కఱయేలేదు. ఏవిషయమునను గూడ శృంగారించి చెప్పఁజాలును. అదితి స్త్రీ, యామె చేసిన విష్ణుస్తుతిలోఁ గూడ "కచ్ఛిత్తణాహేయలలిఅహత్థపయోఅ" (లక్ష్మీస్తనాధేయ లలిత హస్తపయోజ) అనిపించినాఁడు. కొన్నితావుల జెప్పవలసినవిషయము తగ్గించి వర్ణనలు విస్తరించినాఁడు. కవులనఁగా వర్ణించువారేకాని స్థలము, సమయము, తదుచితముగూడ నాలోచించుచుండవలయును. ఇందేకాదు, ఈ విషయము సర్వసామాన్యముగా గథనుమాత్రమే తెల్పవలసిన పురాణములలోఁ

గూడఁ బూర్వులిట్లే సమయోచితముచూడకుండ వర్ణించియున్నారు. రామపరశురాముల సంభాషణము చాలఁ దగ్గించినాఁడు. బుద్ధిబోధలు క్రొత్తవి యంతగా లేవు. ఇట్టులే పాఠకులు చదివిన నాయకాస్థానముల వర్ణనము కాఁగలదు.

ఈగ్రంథమును బ్రకటించుటకు బహుప్రతులలో సరిచూడవలసి వచ్చినది.

1. ఆంధ్రసాహిత్యపరిషత్తులోని పీచుకాగితములప్రతి - ఇది నలనామ సం॥ మాఘ బ ౧౦ జయవారమున దుగ్గిరాల పినసుబ్బయ్యగారి కుమారుఁడు నరసింహముగారు బందరు కృష్ణాజిల్లాస్కూలులో నివసించు గ్రామకరణము సీనయ్యగారను శ్రీనివాసరావుగారి ప్రతిని చూచి వ్రాసినది. (2) పరిషత్తులోని తాళపత్రప్రతి- అ॥ అనదేశపుది. కోరప్పటి వేంకటరామయ్యగా రిచ్చినది. ఈ రెంటిలో నక్కడక్కడఁ గొన్ని భాగములు లేవు.

2. దొరతనమువారి ఓరియంటల్‌లైబ్రరిలోఁ గొన్ని టీకలు గొన్ని మూలమాత్రములును గలవు. అందును రెండుతాళపత్రప్రతులు పూర్తిగానున్నవి. తక్కినవి యసంపూర్ణప్రతులు. టీకలలో మూఁడునాలుగాశ్వాసములకు టీకలు లేవు. పంచమాశ్వాసములోని ప్రాకృతగీతము వ్రాయకుండ విడిచిపెట్టఁబడియెను. ఒక కాగితము మూలములోనే గద్యపద్యము విడిచి స్థలముమాత్రము వదలినారు. పూర్ణగ్రంథములలోఁ బాఠభేదములు ననర్థకములు వ్రాఁతతప్పులు మెండుగానున్నవి.

ఈ దశావతారచరిత్రమును బుష్పగిరితిమ్మన్న రచియించెననువాడుక గలదుగాని రచననుబట్టి యది తిమ్మన్నకవిత్వముగాఁ దోఁపదనియు నట్లు వదంతిపుట్టుటకుఁ గారణము కనఁబడదనియు రా॥ బ॥ వీరేశలింగము పంతులుగారు వ్రాసినారు

ఈపుస్తకమునఁ జాలఁభాగము చక్కఁజేసి ముద్రించినారము. అయినను లోపము లింక నుండవచ్చును. ఆలోపములను బాఠకులు దెల్పిన రెండవసారి ముద్రించునపుడు తప్పక సవరించెదము. పాఠకబృందము మేము శీఘ్రకాలములో ద్వితీయముద్రణము గావించున ట్లాశీర్వదించునుగాక!

తండయార్పేట,
చెన్నపురి. 6-2-1926.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# వి ష య సూ చి క.

పుట.



శ్రీరస్తు.

# దశావతారచరిత్రము.



## పీఠిక.



కరమత్స్యకూర్మకిటిసింహవటూత్తమరామబుద్ధక
ల్క్యాకృతుల న్వచోమరధరార్భకవాసవసంశ్రవార్కకా
మాకుముదాప్తభృజ్జయకృతావనుఁడై తగు వేంకటేశుఁ డెం
తేఁ గృపఁ బద్మనాభసచివేశ్వరుకృష్ణసుధీంద్రుఁ బ్రోవుతన్. 1

ఉ. శోణితవాణి పంకరుహపాణి సమాఘనవేణి నిత్యక
ల్యాణము పచ్చతోరణములం దగి తామరతంపరై కవి
ప్రాణపదంబు తా మగదలాన్వయకృష్ణసుధీంద్రచంద్రక
ల్యాణమణీగృహంబున నిరంతరము న్వసియించుఁగావుతన్. 2

శా. అంతర్వాణులు రీతు లంచను నవఖ్యాతి న్నివారించెఁ గా
సంతోషంబున వస్తువాహనము లశ్రాంతంబుఁ దా నిచ్చి మా
కిం లేచాలు నటంచు సంతసముతో నింపొందు నాభారతీ
కాంతుం డవుతఁ గృష్ణమంత్రిమణి కాకల్పంబు దీర్ఘాయువున్. 3

మ. తతయుక్తిం ఘనశబ్దము ల్వెలయ నర్థవ్యంజకప్రక్రియల్
తతి నానద్ధతఁ బెంచఁ దత్తదుచితాలంకారము ల్మీఱ శ్రీ
పతిచారిత్రము సర్వగోచరతచే భాసిల్లఁగా భారతీ
సతి యస్మద్రసనాగ్రరంగమున లాస్యప్రౌఢిఁ బాటింపుతన్. 4

ఉ. సప్తఋషీంద్రు లెల్ల బుధజాలము మెచ్చఁగఁ బార్వతీచకో
రాప్తముఖీవివాహమున 'నస్య భవేత్తవ సర్వమంగళా
వాప్తి' యటంచుఁ బల్క దరహాసము పూను శివుండు సత్కృపై
కాప్తతఁ బద్మనాభసచివాగ్రణికృష్ణసుధీంద్రుఁ బ్రోవుతన్. 5

మ. తనగంభీరతచేత నిర్జలతఁ బొందం జేసి వారాశి డాఁ
గినమైనాకునిఁ బైటవైవక జగద్గేయప్రదానంబు వా
హినుల న్నించె నటంచు సమ్ముదముతో నింపొందు శైలేంద్రనం
దన యిచ్చుం దయఁ బద్మనాభఘను కృష్ణస్వామికైశ్వర్యముల్ 6

మ. తళుకుంబంగరుమేను వజ్రమయమౌ దంతంబు హస్తంబునం
దళుకున్ముత్తెపుమోదకంబు దగ శృంగారంబుగాఁ జేసి ని
చ్చలుఁ బూజించుటచేఁ బ్రసన్నుఁడయి నిష్ప్రత్యూహసంసిద్ధిచే
వెలయించు న్గృతి నేకదంతుఁడు కృపావేశంబుతో నెప్పుడున్. 7

మ. భవతేజంబునఁ బుట్టి రామభజనాపారీణుఁడై పద్మసం
భవసామ్రాజ్యరమాధురంధరతకై భాసిల్లియు న్నిత్యస
త్త్వవిశేషస్థితి సర్వరోధివిషయధ్వాంతార్కబింబాకృతిన్
భువిలో మంతునకెక్కినట్టి హనుమంతుం గొల్తు నిష్టాప్తికిన్. 8

మ. ఘనశబ్దేభ ముదీర్ణవర్ణమణిప్రేంఖద్ఘాటిఘోటంబు చం
కనదర్థం బతిహృద్యపద్యభటసంఘాతంబు లోకైకరం
జనశృంగారవధూక మైనకవితాసామ్రాజ్య మేలంగ నే
ర్చినవిద్వత్కవిరాజరాజుల వచశ్శ్రీ నెంచి ప్రార్థించెదన్. 9

మ. పదలాలిత్యము లేమి ఖంజులును శబ్దజ్ఞానవిజ్ఞానసం
పద లేమిన్ బధిరు ల్పదార్థములు గానన్ లేమి జాత్యంధులు
న్మృదుత న్వేఁడిన నుత్తరంబొసఁగలేమి న్మూఁగ[illegible] వారి దు
ర్మద మేమాత్ర మదేల తాఁ గృశకవిమ్మన్యు ల్వివాదార్థులే. 10

సీ. శ్లేషాదిపదములు చెలువుసూపఁగఁ బదవాక్యార్థదోషము ల్వర్జములుగ
విమలకైశిక్యాదివృత్తులు దనర వైదర్భ్యాదిరీతులు దళుకు చూప
సరసరత్యాదికస్థాయిభావములు శృంగారాదిరసములక్రమము మెఱయ
భావవిభావానుభావసాత్త్వికభావసంచారిభావము ల్మించుగులుక
తే. విలసదుపమాద్యలంక్రియ ల్వింతఁ దెలుప
లలితముగఁ బాకములు సేయ లక్ష్యశయ్యఁ
గవిత రచియింప నేర్చు సత్కవికిఁ గాక
గాకవుల కేది లోకవిఖ్యాతకీర్తి. 11

వ. అనిక్రమంబున విశిష్టేష్టదేవతానమస్కృతియు సుకృతిజనపురస్కృతియు దుష్కృతితిరస్కృతియుం గావించి చమత్కృతి మత్కృతి నిర్మింపనాయత్తచిత్తంబుతో నున్న యవసరంబున. 12

సీ. తనదుకీర్తి సరోజధామకు భువనజాతమ్ములు భువనజాతములు గాఁగ
దనప్రతాపాగ్ని కుద్ధతనృపాలపతంగమండలంబు పతంగమండలముగఁ

ధనదయాశరధిరత్నమునకు మార్గణౌఘంబులు మార్గణౌఘములు గాఁగఁ
దనదుయావనవసంతవిజృంభణమునకుఁ గలకంఠికలు గలకంఠికలుగఁ
తే. ప్రబలుమగదలపద్మనాభప్రధాన, పూర్వజన్మసహస్రసంపూర్ణరచిత
పుణ్యపరిపాకఫలరూపబుద్ధిశాలి, మహితగుణపాళి కృష్ణయామాత్యమౌళి. 18

వ. వెండియు నఖండనవఖండధరణీమండలభరణప్రచండమనీషాదండితపుండరీకకుండ
లీంద్రుండును నిజకటాక్షవీక్షాయత్తచిత్తనిర్వర్తితప్రతివసంతయాగకుండలీంద్రుం
డును,మహోదారగభీరతావధీరితసుధారతాధారతాపాత్రగోత్రుండును గాశ్య
పగోత్రుండును, సగణితరమణీయగుణమణిస్ఫూర్తిక్రియానుగుణాయతానవద్యవి
ద్యానిషద్యాయితవిద్వత్కవికల్పితహృద్యపద్యగద్యపద్యసూత్రుండును నాపస్తం
బసూత్రుండును, నప్రతిమానప్రతీకబలవిజితసార్వభౌముండును మగదలసార్వ
భౌముండును, నిర్వేలవిభవవిజితపవిత్రుండును నార్వేలకులపవిత్రుండును, సక
లజనస్తుత్యపాతివ్రత్యనిత్యాంతరంగమాంబాప్రతిబింబరంగమాంబా మనఃపద్మ
పద్మబాంధవపద్మనాభప్రధానవతంసనందనుండును దద్ధ్యానవరతవినుతజ్ఞానసనం
దనుండును, సతతసత్కీర్తిపరాయణాదినారాయణాదిసోదరుండును కృపాతా
మరసోదరుండును నగుకృష్ణమంత్రిచంద్రుం డొకానొకనాఁడు కొలువుశృంగా
రంబై యతిశీతలక్ష్మాతలోదరీహృదయతలనిదర్శనాయమానమానితయామినీ
కాంతాకాంతకాంత కాంతవేదికాంతరంబును, నక్షీణయశోహర్యక్షసముత్కోటి
తానీతహరిదంతసంతానళదంతకస్లేజపసంతపాంచాలికాసమంచితకాంచనస్తంభ
సహస్రసంభావితంబును, జామరకళాచికాకనకభృంగారతాలవృంతహాటకపీ
ఠికాపేటికాదిధారివధూటికాకోటికాప్రతిబింబాడంబరసచిత్రవిచిత్రనీరంధ్రమ
ణిప్రభానీరంధ్రకుడ్యభాగంబును,నవ్యరాజన్యకన్యకాహస్తకమ్రతరసాంబ్రాణిధూ
పధూమస్తోమశ్యామభూమాభిరామభ్రమరలలామప్రకామకామప్రదామోద
మేదురజలజాతకేతకీసౌగంధికబంధురితవితానప్రతానంబును, జటులతరస్ఫటికప
టలప్రకటితసోపానరుచితరంగితాభంగురగంగాతరంగిణీతరంగాంతరంగరంగజ్జల
సారంగశృంగారపారంగత మౌక్తికముక్తాభప్రభాసమానోభయపార్శ్వంబును,
నూతనతానమానగాయనీగానద్రవమాణవలభీవలభిదుపలజలబిందుసందోహసం
దేహదోహళతదంతదంతురతంతన్యమానచంచచ్చంచలాచంచలచామీకరచల
దళాంచలసమంచితముక్తామణితోరణంబును, రణాంగణభయానకజయానకాగ
ణ్యధాణంధణ్యాకర్ణనోత్కీర్ణకర్ణవిత్రస్తలీనమత్సమస్తదేశాధినాథవక్షస్థ్సలీవిన్యస్త
నిస్తులకస్తూరికాలేపనానురూపముక్తారంగవల్లికాటోపప్రదీపితప్రతిబింబితరూపా
జీవికాంభోజనయనాకాతకుంభకుంభకుచకుంభికుంభవిజృంభమాణతారావతార
తారతారహారమనోహరప్రాంగణంబును,బద్ధాప్తరుచిపద్మాచ్ఛాదితపద్మపద్మరాగ్రసరా
గవిటంకానురాగసాతావారాపారదృశ్యాపారపారావతారావకూటంబు నగుకొ

లువుకూటంబునం బొడవు కెంపుసొంపు నింపువిను కెంపు నుడికింపువిడి కెంపురవ చెక్క
డంపుకడవన్నె పసిఁడిగద్దియ నధివసించి, కరివేల్పు ముద్దియ చెలంగు ముద్దియ యాట
పట్టు విరిగద్దియపైఁ బెద్దగొలువుండు తెలఁగంటి పెద్దతో నుద్దియై, ప్రచండతరమా
ర్తండమండలంబున నిండుకొలువుండు పుండరీకనయనుని గండుమిగిలి చింతామ
ణిభద్రపీఠంబున సుఖాసీనుండగు నాఖండలు మెండు కొల్లలాడి ధాతుపుంజంబు
కెంజిగి రంజిల్లు నుదయగిరి నుదయించు పరిపూర్ణపూర్ణిమాచంద్రబింబంబు డంబరం
బు విడంబించుచు నోలగంబై పొడగను పాండ్యతుండీర చోళ నేపాళ గౌళ కర్ణాట
కరహాటభోటాది దేశాధినాథుల ప్రధానులయెడ బహుమానంబును, బైగోవర
క్కంగు పారసి మక్కా మలాకాది నానాంతర్ద్వీపధరణీపతు లంపిన పట్టంపు టేనుం
గులు, పట్టుచుట్టలుఁ, బచ్చకప్పురంబు మొదలగు పరిమళంబులుఁ, బడమటిపన్నీ
రు చెంబులుఁ, బంచవర్ణపుఁజిలుకలుఁ, బేరతరుఖండంబులు, స్ఫటికపుగిండ్లు,
పగడపుఁగోళ్ళపట్టెమంచంబులు, పఱపుగల కుంకుమపుపఱపులు, పసిఁడిప్రతి
మలం బోలు పరిచారికాజనంబులు మొదలుగాఁ గలుగు కానుకలు గన్గొనుపట్లం
బరాకును, వందిమాగధపఠ్యమానబిరుదగద్యపద్యాకర్ణనంబున సలజ్జావలోకనం
బును, బాంధవజనంబులయెడ వినయంబును మిత్రులపై ననురాగంబును, భేదా
భేదంబులు వాదించు విద్వజ్జనంబుల కెల్ల ననుకూలంబుగా నేకోత్తరం బొసంగు
నెడఁ బాండిత్యంబును, బ్రకృతిపురుషవివేకంబు ప్రసంగించు సాంఖ్యసంఖ్యావత్ప్ర
సంగంబున నంగీకారంబును, యోగశాస్త్రంబుల ననుభవంబును, దర్కకర్క
శోక్తుల దరస్మితంబును, గణాదేశ్వర ప్రతిష్ఠాపనంబున సమాదరంబును, నిరీ
శ్వరకర్మవాదుల మంగళాచరణాదిప్రసంగంబున సర్వేశ్వరత్వంబు సాధించు
మేధావిశేషంబును, నానాదిగంతాగతకవీశ్వరఘటిత నిజనామాంకితబిరుదా
వళీ చక్రవాళ భోగావళీ త్యాగఘోషణాయత్తగానోదాహరణతాళలీలిత
కావికవితారచనావిశేషంబుల రసజ్ఞతయుం, బ్రవీణవైణికవీణాశ్రవణానురాగ
రాగమేళలయస్ఫురితశిరఃకంపనానువాదంబున నానందంబును, మానికపుఁగం
బంబుల దండనుండు చికిలిదంతంపు బొమ్మలాడి గంపుఁజక్కెరబొమ్మ లని యో
సరిలు ద్వీపాంతరజనంబుల ముగుదతనంబునకు నగుతమచక్కసినగవు చొక్కపుఁ
జీనిచక్కెరని సొక్కి మెక్కనుంకించుచు తెక్కలార్చు కేళికాశుకంబుల కుత్సుకం
బుగ సుధామధురాధరబింబంబులఁ గూడికొను వారవిలాసినుల విలాసంబు లవ
లోకించునెడ నుల్లాసంబునుం జెల్వొందం గొల్వున్న యవసరంబున. 14

క. నను సంస్కృతాంధ్రభాషా, వినుతు ననైకప్రబంధవిరచనదక్షుం
గనుఁగొని యిట్లని పలికెఁ, గ్వనయంబు నయంబు పెంచ్చ విబుధులు మెచ్చన్.

సీ. శ్రీరామకరుణారసారూఢసంస్కృతప్రాకృతాద్యష్టభాషాకవిత్వ
తత్త్వసంవేదివి ధరణిదేవుల తిమ్మయామాత్యపౌత్రుండ వన్న దాన

ముఖ్యనానాదానముదిత భూసురచంద్ర నాగప్రధానేంద్రనందనుఁడవు
పతియమ్మాంబాగర్భపాథోధిచంద్రుఁడ వాత్మవిద్రఘునాయకాగ్ర్యనుజుఁడ
తే. వాప్పుఁడవు గాన వేఁడెద నంశముగను
గృష్ణునిదశావతారము ల్గృతి యొనర్చి
యంకితముసేయు మాకుఁ బ్రఖ్యాతి నీకు
మహితగుణసాంద్ర రామయామాత్యచంద్ర. 16

వ. అని కనకాంబరాభరణగ్రామబహుగ్రామసమేతంబుగాఁ గర్పూరతాంబూలంబు సమర్పించినం గైకొని కౌతుకతరంగితాంతరంగంబుతోఁ గృతినాయకుని వంశావతారం బభివర్ణించెద. 17.

సీ. శ్రీకరవేదాంతసిద్ధాంతవైఖరీపారదృశ్వలు పరబ్రహ్మ మనియు
సృష్టిప్రధానప్రకృతితత్త్వవిజ్ఞానపరులైనసాంఖ్యులు పురుషుఁ డనియుఁ
గ్రతుముఖ్యనిర్మలకర్మప్రవర్తనహితులు మీమాంసకు లీశుఁ డనియుఁ
బంచసంస్కారవద్భక్తిప్రపత్త్యంచితపాంచరాత్రులు శేషి యనియు
ఆ. మఱియు ధన్యులయిన మాధ్వులంతర్యామి, యనియు నెట్టిదేవు నాశ్రయింతు
రట్టిదేవదేవుఁ డాదినారాయణుఁ, డఖిలజనముఁ బ్రోచు నాదరమున. 18

తే. [1]భువనజాతాశ్రయం బౌట భోగిశయను, నుదరతలమున నీరజ మొదవె దానఁ
గలిగె బ్రహ్మరజోయుక్తిఁ గారణాను,గుణము కార్యం బగుట యెట్లొకో గణింప.

తే. బ్రహ్మకు జనించెను మరీచి బ్రహ్మవర్చ, సకృతఘర్మమరీచిలోచనమరీచి
యతనికుదయించెఁ గశ్యపుఁడనభివిదిత, గోత్రదాయకుఁ డయికులగోత్రధృతిని.

శా. శ్రీమత్కాశ్యపగోత్రవారిధి జనించెం బూర్ణసోమాకృతిన్
సోమామాత్యుఁడు సత్కళావిలసనాస్తోకావలోకంబు శ్యా
మామోదంబుఁ గలప్రసక్తికమలోదారప్రచారంబు ని
త్యామందప్రమదాశ్రయద్బుధకుమారాన్సక్తియు న్మీఱఁగన్. 21

సీ. రసమంటె ననుచు నీరసముతోఁడఁ బుటంబు వేయ మేరువుఁ జేరె విశ్వకర్మ
రాయంచఁ దేనేమిరా యం చమర్షియై సాదితో వాదించె షణ్ముఖుండు
నారదకలను గన్నార దర్శింతురే యని తుంబురుని వేఁడె నమరవిభుఁడు
నలువవనంబులనలువొందుశివుఁ డెందుఁ గలిగె నంచు విరించిఁ గనిరి మునులు
తే. మహితమగదలసోమనామాత్యసోమ
రామణీయకయుతకీర్తిరామరుచిర
రుచినిచయ మెల్లదిక్కులఁ బ్రచుర మయిన
భ్రమసి తెలియంగఁజాలక ప్రౌఢు లయ్యు. 22

1 భువనజాతాస్పదం.

క. సోముఁడుగావున గౌరీ, భామినిఁ జేకొనియె ననుచుఁ బ్రజ లెన్నఁగ నా
సోమామాత్యశిఖామణి, ప్రేమంబున గౌరమాంబఁ బెండిలి యయ్యెన్. 23

క. గౌరమ సుగుణావళి బా, గౌరమ మహిమమహిళ నగుక్షమాన్విత యయ్యెన్
గౌరమనోహరకీర్తులు, గ్లౌరమ హసియింపఁగా జగన్నుతలీలన్. 24

తే. గౌరియందుఁ గుమారునిఁ గనియె సోముఁ, డౌర యచ్చెరు వని జనులనఁగ సోమ
మంత్రి గౌరమయందుఁ గుమారుఁగనియెఁ, దిమ్మనామాత్యచంద్రు సుధీఫణీంద్రు.

శా. ఏమే జాహ్నవి యేమి రాఘవ యదేమే వైరి నెన్నెవు నీ
వేమీ నాసవతిం [1]గణించెద ఏదేమీ నీవు కాళిందివా
యామే నేటికిఁ బెల్లనాయె జలధీంద్రా తిమ్మమంత్రీశ్వర
శ్రీమత్కీర్తులు గ్రమ్మఁగా ననిన నాశ్లేషించు హర్షంబునన్. 26

క. తిమ్మనమంత్రీంద్రుఁడు లక్ష్మమ్మను వరియించి కనియె నాశ్రితజలరు
ట్సమ్మోదనచాతుర్యక, విమ్మాన్యదయాప్రచారు వేంకటధీరున్. 27

చ. మగదలతిమ్మధీరునికుమారుని వేంకటమంత్రి నెన్నఁ బ
న్నగపతి శక్తుఁ డౌనె తదనారతకల్పితదానవాహినీ
లగనసమృద్ధసస్యఫలలాభములన్ సకలప్రజాప్రజం
బగణితభోగ మొంద [2]వృషగౌఁ జెలువు ల్దొరఁగు ల్ప్రవర్షముల్. 28

సీ. అగ్రహారంబుల నలరించె ధారుణీరమణీకుచాగ్రహారములు గాఁగ
దానము లొనరించె ధరణి నిర్జరభూరిదారిద్ర్యహరణ [3]నిదానములుగ
నర్థులఁ బోషించె నసమానచీనిచీనాంబరదానకృతార్థులుగను
బంధుల రక్షించె సింధుబంధుసుతావృగంతబంధురకృపాబంధులుగను

తే. మంత్రిమాత్రుండె మానినీమానమథన, మదనసమమూర్తి హరిదంతమధురకీర్తి
[4]వినతనృపపాళి వర్ధితవినుతపాళి, మహితరుచిహేళి వేంకటామాత్యమౌళి. 29

క. పద్మాధరణుల నేలిన, పద్మాక్షునిలీల [5]వెలసె భాసురతేజ
స్సద్మము వేంకటధీమణి, పద్మాంబిక వేంకటాంబ భార్యలుగాఁగన్. 30

తే. శౌర వేంకటవిభుద్వితీయద్వితీయ, యద్వితీయగుణస్ఫూర్తి నతిశయించి
యద్వితీయేందుహసియించు నళికరేఖ, వశమె యావేంకటాంబచెల్వంబుఁ బొగడ.

సీ. విబుధేంద్రమాతయై ప్రబలె నాయదితి దాఁ గశ్యపుసంగతి [6]గాంచు టెట్టు
లతిసువర్ణాఢ్యత నందె నాభారతీపతి హయంబులఁ బట్టఁ బనుపు టెట్లు
స్నేహంబు గలిగె నాక్షితిభృత్కుమారి యీశ్వరుతల జడగట్ట నరయు టెట్లు
విభవంబుఁ జెందె నాఋభురాజగేహిని గనుమూయ నెడలేక మనుట యెట్లు

---

1 గణించితివి యేమీ. 2 వితతా. 3 విధాన. 4 విజిత. 5 మెఱసె. 6 'గాంచుటెట్లు; పనుపుటెట్లు' అనియు కలదు.

తే. ఖ్యాతము గాదిది విబుధేంద్రమాత యనిన
సతిసువర్ణాఢ్య యనిన స్నేహవతి యనిన
విభవవతి యన్న మగదలవేంకటాంబ
గాక యితరల కెవ్వి యీగౌరవములు. 32

క. ఆవేంకటాంబగర్భసు, ధావార్ధి జనించి రమరధరణీరుహాసు
శ్రీ వెలయఁగ నేగురుసుతు, లావిర్భావాదివితరణాన్వితు లగుచున్. 33

ఉ. తిమ్మన వీరరాఘవసుధీమణి కేశవమంత్రి దాతృతా
హమ్మతి పద్మనాభసచివాగ్రణి నారణశౌరి వారిలోఁ
దిమ్మన పాండితీగతి నుతింపఁగ శక్యమె భోగివల్లభుం
గిమ్మనసీఁడు వాగములకే చనుదెంచిన యుక్తిశక్తులన్. 34

సీ. సంగీతపుంభావశారద సాహిత్యతత్త్వాద్యతనకాళిదాసుఁ డతఁ
వితరణైదంయుగీనతపనతనయుండు [1]భూతదయాదృతభూతలుండు
భక్తిప్రహృష్టనాభాసరోజుఁడు శాశ్వతైశ్వర్యపాకౌశికతాద్రిసుతుఁడు
దిక్కూలముద్రుజదేదిరద్ఘనకీర్తిజాగ్రత్ప్రతాపశౌర్యశాలి
తే. వీరవేంకటపతిరాయవిభువతంస, భావితోభయచామరభద్రదంతి
దంతపల్యంకికాదిసన్మానఘనుఁడు, ధీమరున్మంత్రి మగదలతిమ్మమంత్రి. 35

ఉ. తిమ్మనమట్ల సేనియలు సేరగఁ బల్కఁగ నేర్పు బంధుజా
తిమ్మనఁ జూచుఁ బ్రోచు నతిథిప్రకరమ్ములఁ గైటభాభియా
తిమ్మనసారఁ గొల్చునతిశీరత వేంకటమంత్రిపుత్రుఁడౌ
తిమ్మనమంత్రి పాటిజగతీస్థలిలోపల మంత్రి గల్గునే. 36

తే. అట్టితిమ్మనమంత్రి వెంగాంబయందుఁ, గనియెఁ దిరువేంగళాంబనాఁ గన్యలక్ష్మి
చెలువునను శ్రీనివాసార్యుఁ జెట్టపట్టి, [2]కనియె నాదెప్ప రంగప్ప ననఘమతుల.

తే. వీరరాఘవమంత్రికి వీరరాఘవుండె సరిగాక ధర మానవుఁడు సరియె
శౌర్యగాంభీర్యసౌందర్యసౌకుమార్య, కార్యచాతుర్యధుర్యతౌదార్యములను.

మ. తరమే వేంకటమంత్రి కేశవుమహౌదారత్వ మెన్న స్థిరం
తరముం దానజలైకవర్షకఘనానందం బతం డొందఁగాఁ
బరమంత్రీశ్వరకీర్తిహంసికలు విభ్రాంతంబులై యేడకో
యరిగె న్మానసవాసముం గనక యత్యాశ్చర్య మౌనే కదా. 39

సీ. మానసీయనరేంద్రమంత్రాచరణవేళ ఫణినాయకుఁడు తడఁబడకయున్న
విబుధవల్లభసభావిద్యాప్రసంగతి గురుఁడు వాగ్వాదంబు గోరకున్న
నతిశయాళుతఁ గాంచునవసరంబున బ్రహ్మ యాగమపాళిఁ బోనాడకున్నఁ
దత్త్వవివేకచింతనవేళఁ బురవైరి సర్వజ్ఞగతిఁ గాంచకయె యున్న

---

1 భూసురత్రాకృతభూమితలుఁడు. 2 కనియె రంగప్ప నాదెప్ప.

తే. సాటి యనవచ్చు మగదలశాసనాంక, వేంకటామాత్యమకరాంకపంకరహిత
పంకజగృహాజనకనిష్కలంకపూర్ణ, చంద్రునకుఁ బద్మనాభసుధీంద్రునకును. 40

సీ. ప్రతిఘటించిన నెంతబలవంతులను బటాపంచగాఁ దఱిమించుప్రౌఢిమంబు
సమ్మతి మన్న నెంతటిదరిద్రుల నైన శ్రీలచేఁ జెల్వొందఁ జేయుకరుణ
మతభేద మన్నచో మతిమంతు లౌనన నైకమత్యము సేయునలఘుబుద్ధి
వలయునటన్న భూవరుల నంగటఁ గార్య మెంతయైనను నిర్వహించు నేర్పు

తే. విద్య వినయంబు తాదృశవిభవమునను, శాంతి యేపట్ల ధైర్యంబు సరసమృదుల
భాషణంబులు గల్గి వైభవముమీఱఁ, బ్రబలు మగదలపద్మనాభప్రభుండు. 41

సీ. మంత్రీశ్వరుఁడు గాన మూాళిపై వలగొన్న భాగీరథి యనంగఁ బాగ దనర
రామకథాసుధారసము బుగ్గలఁబోలి కట్టాణిగొప్పచౌకట్లు మెఱయఁ
గనకంబుఁ గెలుచునంగంబు తేజముమీల నేకరంగికబాయి యింపుగులుకఁ
బైకొన్న యాదిమప్రభులకీర్తులరీతి వలిపెపై వాణిదుప్పలువ వెలయ

తే. గుణములనుబోలి వృత్తానుగుణము లయిన,కంకణాలికముత్యాలకడియములును
మొదలుగాఁగల భూషణంబులు వెలుంగఁ, బ్రబలు మగదలపద్మనాభప్రభుండు.

సీ. అపరిహాస్యంబుగా నన్యమతంబులయందు శంకఘటించునోఘశంబు
నలరామకథల పాయసవిభాగంబుల నేకరీతిగ నిర్వహించుపటిమ
శివకర్మానాదిభావ మీశ్వరసమత్వము గ్రమంబునఁ దెల్పు తత్త్వసరణి
ఘనభర్తృహరిశతకత్రయంబునఁ బ్రతిశ్లోకంబునను వింతఁజూపు సొబగు

తే. మఱియుఁ జాటువులందు రామాయణాది
బహువిధగ్రంథములయందుఁ బ్రాజ్ఞులెన్నఁ
బూర్వసిద్ధాంతపక్షము ల్పొసఁగఁ జేయు
భళిర మగదలపద్మనాభప్రభుండు. 43

సీ. వరముతోఁ దుహినకందరముతో గిరిశనూపురముతోఁ బచ్చకప్పురముతోడ
రసముతో ధవళసారసముతో శివమహానసముతో సుషితమానసముతోడ
శరముతో మరుజాజిశరముతో ముత్తెలసరముతో దేవతానరముతోడ
భవునితో నజతనూభవునితో రేవతీధవునితోఁ గుముదబాంధవునితోడ

తే. దోడుసీడయి క్రీడించు వేడుకలరఁ, బ్రౌఢగాపున మగదలపద్మనాభ
సచివమూర్ధన్యబహుదానజాయమాన, కీర్తికాంతాలలామ దిగ్విజయధామ.

చ. మగదలపద్మనాభునిసమస్తగుణవ్రజముం గణింపఁగా
నగణితనూాట నూరకగుణాకరుఁ డంటిని దొంటివారలుఁ
సగుణుఁడు పద్మనాభుఁ డని సన్నుతిసేయుటె కాని తద్బహు
ప్రగుణగుణంబులు న్వరుసఁ బాయక యన్నియు నెన్న నేర్చిరే. 45

*

తే. జలధిమధ్యస్థుఁ డాతఁడు జలధితీర, వాసియితఁ డనునొకమాటవాసి గాక
పద్మనాభుండు మగదలపద్మనాభుఁ, డఖిలలోకావనమున నన్యోన్యసములు. 46

ఉ. [1]కోసలరాజకన్యక యొ కుంభినిలోపల వేంకటాంబయై
భాసిలఁ బద్మనాభుఁడయి ప్రాగ్రఘువీరుఁడు పుట్టెఁ గానిచో
మాసము తార లగ్నము సమస్తశుభగ్రహవీక్షణంబు లొం
డై సరిపచ్చువేళ నుదయంబగునో విబుధాళిఁ బ్రోచునో. 47

మ. ధనదోదారుఁడు పద్మనాభసచివాధ్యక్షుండు పక్షంబుతో
ననఘాత్యుత్తమదోర్ద్ధప్రవృత్తికులజుం డైనట్టిధర్మప్రథా
నునికానూత్నమకుం జనించి బుధరాణ్ముఖ్యస్ఫురల్లక్షణా
వనియా రంగమఁ బెండ్లియాడె మహితైశ్వర్యం బవార్యంబుగన్. 48

సీ. పతిభక్తిచే నరుంధతి యుద్ది యనవచ్చుఁ దను వ్రేలఁ జూపించికొనకయున్న
దాక్షిణ్యమున శైలతనయ జోడనవచ్చు నిజవిగ్రహామున నొనయకున్న
క్షాంతిచే ధారుణి సరి యనవచ్చు ధాతను జేరి మొఱ పెట్టుకొనకయున్న
మతిమహత్త్వమున భారతి సాటి యనవచ్చుఁ బ్రజలనోళ్లకు నెల్లరాకయున్నఁ
తే. గాక యితరధరాతలకాంత లెనయు, యంచు జను లెంచ నంచితోదారసుగుణ
మణిగణంబుల కెల్లయై మనుముఖాబ్జ,రచితశశిబింబ మగదల రంగమాంబ. 49

సీ. ఏసాధ్వి [2]పెనటిలో నెలదోఁటఁ గని వజ్రినందనవని నిందనం బొనర్చు
నేయంబ పెండ్లిండ్ల కిప్పింపఁగా బ్రహ్మచారులు కఱవైరి జగతిలోన
నేతల్లి యొడ్డింప నింపుతో భుజియించు జనులకు మాతృవిస్మరణ మొదవు
నేయమ్మ దయఁ బాలువోయింపఁబుర బాలు రాయురారోగ్యభాగ్యములు గాంతు
తే. రట్టిలోకైకపావని యఖిల విమల,గుణకలాపావని తటాకకోటిభాగ
సుప్రతిష్ఠితపావని క్షోణి వెలయు, రక్షితమహీసురకుటుంబ రంగమాంబ. 50

ఉ. శ్రీయలమేలుమంగవలెఁ జెన్నగు రంగమగర్భవార్ధిచం
ద్రాయితవేంకటేశసచివాగ్రణికృష్ణసుధీవరుండు నా
రాయణమంత్రిశేఖరుఁడు రామవిభుండును వేంకటేశుఁ డ
ప్యాయతకీర్తిశాలు లుదయంబయి రాశ్రితకల్పశాఖులై. 51

సీ. శ్రీనరేశ్వరులకుఁ గోవెలలూరూరఁ గట్టించె నేమంత్రి ఘనత మెఱయ
నా కాశిసేతుమధ్యస్థపుణ్యస్థలుల్ సేవించె నేమంత్రి కీర్తి వెలయ
ఖ్యాతి కెక్కఁగ దీర్ఘికాతటాకంబులు త్రవ్వించె నేమంత్రి తలచుగాఁగ
సకలమార్గంబులఁ జల్లగా వనములు వేయించె నేమంత్రి వేడ్కమీఱ
తే. నతఁడు చెలువొందు నన్నదానాదిసకల,దానవిద్యాపరాభూతధనవిభుండు

1 కోసలరాజనందనయొ. 2 పెరటియెలదోఁటఁ.

నూత్న దేదీప్యమానభాసుప్రభుండు, నవ్యవిభవుండు నారాయణప్రభుండు. 52

సీ. అతనుండు నొకల ప్రాస్వాకారుఁ డౌటఁ జేఁ జెలువంబునను సాటి సేయరాదు
గురుఁడును సర్వలఘుత్వ మొందుటఁ జేసి యాయతమతి సాటి సేయరాదు
రవిఁ గడపట విశీర్ణంబుగాంచుటఁ జేసి స్థిరమున సాటి సేయరాదు
శారదాబ్ధం బపశబ్దం బగుటఁ జేసి చికీర్తితో సాటి సేయరాదు

తే. సాటియే నేఁడు యొకపాటిసచివులకు, వైరివిరోధులకు వచనవిభవ
భవతులాలోకి విస్తీర్ణిసాంద్రితీని, ప్రస్తుతింతారి శిఖి నానాగ్ర్యమణికి. 53

మ. అగధీరుం డగునారనార్యుఁ డప్రమేయసూనసానబూడుూరిలో
నగవిశ్వేశ్వరు నన్నపూర్ణ నటచెంతం దు తి ఖి ఘ్నేశ్వరు
స్నిగమస్తుత్యుని క్షేత్రపాలు మణికర్ణిం గల్గఁగాఁ జేసి విం
తగ సాధుఃఖ్యాలదాత్రి భావనయఁ గాదాయంచుఁ గీర్తింపఁగన్. 54

సీ. ననిలోన స్త్రీమాట విని యన్న కోకసంత దెచ్చినఁ ద్దేవుఁ డెగడి
తనవింటి బ్రద్దఁ దిట్టెనటంచు నగ్రజుఁ దూషించినట్టి పార్థుని హసించి
యన్న పక్షమువారి నటుడించి తానొక పక్షమై పుండరీకాక్షు నవ్వి
మునుదా గురుదోహమునకు లోనై యగ్రజు వునకుఁ జేర్చిన లవుసు నెగడి

తే. హార్ష మొసఁగుచు మాఱుమాటాడక వెలసి
యన్న పక్షము దనపక్షమై చెలంగి
బహుళసుకృతంబు లొనఁగూర్చి ప్రబలుఁ డద్ద
నార్యనసుజుండు నారాయణప్రభుండు. 55

శా. ఆనారాయణమంత్రిశేఖరుఁ డనంతాంభోనపాళీజగ
త్ప్రాణుండౌ కురుగోటిమాఢ పరుకు న్నామకృష్ణం బుత్రిన్గామె
తోనం దిమ్మయవీరరాఘవముఖుల్ దోర్బలిష్టులై వర్తిలఁగ
శ్రీనారిమణిగా లు వెంకమ కరించె న్వాకకల్మిం దనరన్. 56

తే. అసము వాసగంగ మతియు గాయసమము చెల
యార్యమణాళికి నారాయణమ్మ కాత్మ
జాతయైనట్టి వరసమ్మ సమతనించు
మమతవరియించె నారనామహాత్మ విభుఁడు. 57

సీ. తన మాశ్రితుల సంపద గాంచి ధనదర్త ధనవాంఛ నుకొర్చి తపము సేయ
నవిలాసము గనుంగొని సిటు వెట్టెడు సూనాస్త్రు తీరును చుక్కరనఁగఁ
వనదానజలవార్ధిఁ గనియుక్కనమ నిస్స్య పలు పసు పేరసములొనఁగ
వనవైభవమునుజూచినవారలేంద్రుఁ డం బోరులతోఁ గన్నిసం బూసికొనఁగఁ

తే. బ్రబలు దేశాధినాథనబాబుసాహెం, బూనవిస్తీర్ణ సువర్ణజాంబూనదాంబ
రాసమగ్రామబహుమానభాసమాన, నవ్యవిభుఁ డగు నారాయణప్రభుండు. 58

సీ. నీరాకరములెల్ల క్షీరాకరము లయ్యెఁ దానవులు గీర్వాణతతు లయ్యె
ధేనువెల్లను గామధేనువు లయ్యెను మ్రాఁకులు వేల్పుగంటె మ్రాఁకు లయ్యె
నగములెల్లఁ దుషారనగము లయ్యెను పన్నగంబులు దొలిపన్నగంబు లయ్యె
మునులెల్ల నారదమును లైరి గగనవిహారులు భుజగేంద్రహారు లైరి

తే. యెవ్వాని మగదలవంశరత్నాకరాధినాథచంద్రాదినారాయణప్రధాన
చంద్రని స్సాంద్రతరకీర్తిసాంద్రరుచులు, మించి లోకత్రయంబు నాక్రమించుకతన.

తే. అనఘుఁ డయ్యాదినారాయణార్యమౌళి, ఘనుఁడు రాచూరి వేంకటేంద్రునకుఁ గూన
మకును సుతయైన తిమ్మాజమను వరించి, కనియె భాస్కరదాసాంకతనుజమణుల.

ఉ. హాటకదాతయౌ మగదలాధిపకృష్ణునిదానవాహినీ
ఝాటము చేత నుబ్బుచును సర్వజనస్తవనీయత స్థిరా
ఘాటగభీరతాగుణము గాంచిన సుప్రకు చునుండఁగాఁ జుమీ
పోటును బాటునంచు జనము ల్గణియించును వారిరాశికిన్. 61

తే. గరిమ నఱువదినాలుగుకళలఁ బొసఁగి, ఘనుఁడగు మగదలకృష్ణమంత్రీంద్రవదన
మునకుఁ బదియాఱుకళలచేఁ దనరు నబ్జమండలము జోడె పాదాభ నుండుఁ గాక.

సీ. అమరంగిఁ దా నంబరము గప్పుకొను నట్టు కవులకీయఁడు మేఘుఘనత యెంత
తాను రత్నోర్మికల్లోలల్బు నవ్వసీఁడు పాథోధినాథుని ప్రభుత యెంత
గంధంబు గను నోసంగదు ద్విజ శ్రేణికిఁ గల్పవృక్షము కల్పకత్వ మెంత
సుమనోవతంసమనాంచును బుధ్యాజనులకీ చనినిమిషేంద్రమణిరాతన మదెంత

తే. భువిఁ జతుర్విధశృంగారములు సమిత్ర, బంధుకవిధీరజనములుగాఁగ బౌధిమీఱఁ
బూను మగదల కృష్ణప్రధానభాను, నిరుపమౌదార్య లీల వర్తించువేళ. 63

మ. తలఁపం గర్ణుఁ డపార్థదాతయు యపాత్రత్యాగిమూర్ధన్యుఁ డా
బలి వ్యర్థంబగు గల్పకంబు ఫలియింప న్నేసుఁడుం దారవా
తలమాత్రంబు ధనంబొసంగఁడు గదా తద్దానము ల్మెత్తునే
యలఘు ప్రౌఢిఁ దుర్బద్ధనాభఘను కృష్ణామాత్యుఁ గీర్తింపు చోన్. 64

సీ. రాజరాజసుహృద్ధరాజరాజముఖవిరాజరాజన్ముఖ ప్రభల నేలి
పారిజాతకపావపారిజాతరిపుద్విపారిజాత[1] శ్రీలఁ బ్రతిఘటించి
హరికాండగంగాలహరికాండకులేంద్రహరికాండవిభుల నతకరించి
ఘనసారశారదఘనసారసజవాహఘనసారకాంతులఁ గడకుఁ దఱిమి

తే. కలశజలనిధిహాలధరజలజతుహిన, విమలమలయజసురగజవిశదకమల
కుముదసముదయధవళిమదమణఁదాల్చి, యెసఁగె మగదలకృష్ణమంత్రీంద్రుకీర్తి.

సీ. తల్లిదండ్రులు ముకుందద్రోహులంచును బాథోధిలోపలఁ బ్రభవమొంది
పాథోధిలోపలఁ బ్రభవింపఁ బంకజాతావాసయై క్షితి నవతరించి

---

1 శ్రీలనవఘళించి.

క్షితిజయై పతివివాసితయాట వలన వైదర్భభూవిభున కావిర్భవించి
వైదర్భియై మహీవరుల సన్నిధిని గోపాలకబాలకాపహృత యగుచు
తే. వెనుకఁ దపములచేఁ గొండవీటి సిద్ధి,రాజఘనునకనకాంబగర్భమునఁ బొడమి
కృష్ణనిభుఁడైన మగఁడలకృష్ణవిభునిఁ,జేరి కొదలేక తనరు లక్ష్మమ్మ గాక్షి. 66
తే. గుణసముద్రుండు గణుతింపఁ గొండవీటి, సిద్ధిరాజేంద్రుఁ డెల్ల నశీతకరుఁడు
లక్ష్మి లక్ష్మమ్మ సౌభాగ్యలక్షణములఁ, గృష్ణదేవుఁడు మగఁడల కృష్ణవిభుఁడు. 67
ఉ. నారదమౌని యేమిసురనాథ విశేషములేమి వింటిరో
సారసగర్భుచెంగటను శారద లేదఁట ముందు నిల్చెనో
యారసిచూడుఁడా మగఁడలాన్వయదుగ్ధపయోధిరాజమం
దారము కృష్ణమంత్రిరసనాస్థలి నిల్చెను యుక్తమే కదా. 68
సీ. శ్రీవిరాజితుఁడైన సిద్ధిరాజేంద్రుఁడు శ్రీకృష్ణదేవుని చెలువు గుల్క
ననిశంబు రుక్మిణియై మించుకనకాంబ భోజమహీరాజపుత్రిఁ బోలఁ
గులరూపసౌభాగ్యగుణములఁ బెద్దయౌ కోనాంబ రతిదేవికో ప్పుచూప
[1]నాశ్రితదోషాపహరుఁ డైనయెల్లన యనిరుద్ధవిఖ్యాతి ననుసరింప
తే. భామినీజనమోహనాంబకవిలాస, వైఖరిఁ గాంచి మన్మథునకెఁ జెలంగుఁ
గొండవీటికులాంభోధికువలహితుఁడు, మత్యహీశ్వరుఁ డెల్లనామాత్యవరుఁడు.
సీ. శ్రీరామచరణరాజీవకైంకర్యతత్పరరంజనుఁడు రామదాస ఘనుఁడు
దాక్షిణ్యనైపుణ్యరక్షితానేకసత్కవితంత్రి శింగపదంసుమంత్రి
యనవద్యహృద్యవిద్యాప్రౌఢిఁ బద్మగర్భనిభుండు బద్మనాభప్రభుండు
నలకూబరజయంతనలవసంతలతాంతసాయకాకృతి రంగశాయిసుకృతి
తే. వివిధరాజద్గుణకదంబ వెంకటాంబ,సుత్యనయగాలి రఘుపత్యమాత్యహేళి
ధన్యజనమాన్య సీతాభిధానకన్య,జనన మొందిరి కృష్ణధీసచివమణికి. 70
సీ. దేవిదేవరఁ బోలి దీవిమై వర్ధిల్లి తల్లిదండ్రియు సంతోషంబుఁబ్రోవ
శ్రీరామునను సరించిన లక్ష్మణునిభక్తి సహజుండు సౌభ్రాత్ర సరణి నెఱప
హారినిఁ జెందినలక్ష్మి కరణి సద్ధర్మిణి చిత్తానుగుణశీలఁ జెలువుచూప
జలధిసంతానంబునలువున నౌదార్యకలితమై పుత్రవర్గంబు మెలఁగ
తే. నల్లసౌభరినడవడి నైనకీసి,కెనయొయంచు జగజ్జనంబెల్లఁ బొగడ
సిద్ధసంకల్పుఁడై సుఖశ్రీల వెలయు, జిష్ణువిభవుండు మగఁడలకృష్ణవిభుఁడు. 71
సీ. చంద్రికపూఁపన్నె జిలుగుఁదుమాలుపై జాతిమిన్నుల తురా చౌకళింప
నగుముద్దుమోమున మృగనాభి తిలకంబుగులుకుడా ల్సిరులుముంగురుల నెరయఁ
దళుకుఁగిరీటిపచ్చలకు బోడై తేట నునుపాలకాయయొంటులు పొసంగఁ
గమికెందుముత్యాలకంఠమాలికఁ గూడి నీలంపుదుమ్మెదతాళి మెఱయఁ

1 వాశ్రితోపాకరుం డగుచిన్నయల్లన.

తే. గుందనపుఁదళ్కు నెఱపూఁతగంప మమరఁ
దగటుఁ జెలుగులఁ జెంగావి సొగసుఁ జూపఁ
జిల్కు సామ్రాణి తేజివజీరుఁ గేరు
కృష్ణమంత్రీంద్రుచెలువు వర్ణింపఁదరమె. 72

వష్ఠ్యంతములు.

క. ఈదృశగుణహారునకును, దాదృశనయమార్గనంతత విహారునకున్
శ్రీదృఙ్నవమారునకున్, సాదృగ్జనవినుతభక్త్యజకుమారునకున్. 73

క. ధీరునకుఁ గీర్తిఘటజల, ధీరునకుభుజప్రతాప ధృతసర్వశిరో
ధీరునకుఁ బాలితాఖిల, ధీరునకు సుధాకరస్ఫోన్న తీధిరునకున్. 74

క. సకలకలాపాఠనునకు, సుకవికలాపావనునకు శ్రుతిచాతుర్య
ప్రకలితధీరక్షణునకు[1], బ్రకటితధీరక్షణునకుఁ బద్మాక్షునకున్. 75

క. ధృతిబంధీకృతనానా, క్షితిధరశంకాభిధాయిశృంఖలితమదో
న్నతగజపూర్ణాంగణునకు, రతిరాజ సమానరూప రమ్యగుణునకున్. 76

క. చరణానతశరణాగత, భరణాతత్సత్త్వపాత్రునకు సదా
భరణాయితకరుణాయుత, తరుణాయత విమలకమల దళనేత్రునకున్. 77

క. మగదలకులధన్యునకున్, జగదేకవదాన్యునకు ద్విషద్ధరణీభృ
ద్దిగధిపమూర్ధన్యునకున్, జగతీమాన్యునకు వినుతసౌజన్యునకున్. 78

క. భద్రశ్రీమిహికావిమ, భద్రశ్రీహరకరాబ్జఫణిప బిడౌజో
భద్రశ్రీకంధరబల, భద్రశ్రీనిధియశోవిభవభద్రునకున్. 79

క. ఇంద్రశిలాంతంద్రకళా, సాంద్రవిలాసాభ్యకనకసౌధోన్నతికిం
జంద్రమణీరుంద్రఘృణీ, చంద్రఘృణీకిరణచంద్రశాలాంతతికిన్. 80

క. మంత్రియుగంధరునకుఁ బర, [2]మంత్రికృతాంతునకు దివిజమంత్రినిభునకున్
మంత్రిశరచ్చంద్రునకు, స్మంత్రిమృగేంద్రునకుఁ గృష్ణమంత్రీంద్రునకున్. 81

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నేరచియింపంబూనిన రసికజనకంఠాభరణశ్రీకృష్ణ దశావతారచరిత్రమహాప్రబంధపవిత్రముక్తాదామంబునకు విచిత్రకథాసూత్రం బెట్టిదనిన. 82

1 అకలంకయశోవిరాజితారాధ్యునకున్. 2 మంత్రివిభాళునకు.

# దశావతారచరిత్రము.



## కథాప్రారంభము.



శ్రీరమణాంగుష్ఠశిఖరింద్రమథితావర్ణపయోధిజసుధారస మనంగ
భువనరక్షణసదాశ్రయసిద్ధయోగీంద్రసంభృతసిద్ధరసం బనంగ
ఘూరిమేఘాళివిస్ఫుటపత్త్రపుష్కరాళిందపూరితమరంద మనఁగ
ధరణీధరామహీధరపయోధరభాగలక్షితక్షౌమచేలం బనంగఁ

తే. దనరు గంగాతరంగిణీతటమునందు, వెలయుఁ ద్రిభువనవిఖ్యాతవిభవవిజిత
దేవతాపురభోగవతీపురము, మాపనానాపురము హస్తినాపురంబు. 83

శా. శ్రీరామామణిహారవల్లు లన గంగాకుల్య లేపార ము
క్కియుండుండుఁ బ్రశస్యసస్యములు రంగద్భక్ష్యనానాక్షీరపా
నాంభోధ్యుత్తమసత్త్వహస్తిహయముఖ్యంబు ల్లగు న్నావనీ
తీరావాసపవిత్రులై ప్రజలు సంతోషింతు రప్పోలునన్. 84

ఉ. అప్పురిగొప్పయుప్పరిగలందు వసించిన ముగ్ధకాంత లె
య్యొప్పెడిచందమామ కిది యొప్పున తప్పని పైఁడికొంగుఁ గ
ప్పక రాచిమించి తమునవ్వెడి ప్రోషితహాసకాంతులే
యప్పుడుఁగప్పు గప్పెనఁ గృతార్థులమంచు హసింతు రెంతయున్. 85

చ. ఎలమి విమానమెక్కి చరియించుచు నంబరవీథిఁ బెచ్చు పెం
పలుగను రంభ వచ్చి పురమందలి మేడలపైఁడిబొమ్మలం
[1]గలసియటుండకున్నఁ గలఁకన్నలరాజరుఁ జూచి నేరమే
పలుకవె యంచు బొమ్మచెయిపట్టిన రంభనగుం గిలాకిలన్. 86

చ. శతమఖువారణేంద్ర మతిశక్తి నిజాకృతిఁ జూచి కొమ్మలన్
రతనపుఁగోటఁ గ్రుమ్మినను రాలెదు కెంపు లగడ్తలోఁ బడం
జతనముమీఱ నెత్తి కడుసంతస మొప్పఁగ నెత్తిబన్నగ
ప్రతతులు దాల్చుఁగాక మఱి పాములకేవి జాతిరత్నముల్. 87

ఉ. పట్టణమధ్యభాగవరభాగమణీమయమందిరంబులం
గట్టిన టెక్కెపుందునలు గాడఁగ రౌజ్జముపుట్టెఁ దమ్మిపూఁ

1 గలుసుకయూరకున్నఁ.

జొట్టుములోనఁ గాని యెడ సూరులు నాకముఁ జేరఁ బోవఁగాఁ
బుట్టుట యెట్లు తోఁచు పరిపూర్ణ జనేశ్వరమండలంబునన్. 88

చ. శుకముఖ్యద్విజకర్ణతత్పరవనక్షోణీజపాళీతల
ప్రకరస్యందనసైకతుందిలితమై పాథోధిపర్యంతసంబుధా
త్రికి వర్షించును గాక యున్న లవణాబ్ధి స్నీరముల్ గ్రోలి వా
ర్షికము ల్దియ్యనినీరముల్ గురియునే చోద్యంబుగా నెయ్యెడన్. 89

సీ. ఒకనటుండే చాలు నకలంకవేదశాస్త్రనిరూఢి బ్రహ్మ నధఃకరింప
నొకరాజసుతుఁడె చాలు నుద్వేలశక్తి దిక్పాలురఁ గదిసి కప్పములుగొనఁగ
నొకవైశ్యసుతుఁడె చాలు నురుసంపదల ధనాధిపు నాదిగ నిఖిలు మైత్రికిని బోనుప
నొకశూద్రసుతుఁడె చాలు నుర్వీతలం బెల్ల బహుసస్యమయముగాఁ బదరు సేయ
తే. నొకరథము సాలుఁ గనకాద్రి కొడ్డు సూప
నొకగజము చాలు దిక్కరిప్రకర మెదుర
నొకహయము సాలు రవిహయవ్రాత్యుస్థితిఁ గన
నొకభటుఁడె చాలు రుద్రుతో నొరయ నచట. 90

చ. ఎక్కడఁ మోహవృష్టి యతినిచ్చఁ దలంపక వచ్చి వేఁడినం
జక్కనివాఁడు గాఁ గనుచుఁ జక్కని కల్లుని మెచ్చ గన్నచో
నక్కడి వారకామినులు యోగ్యము వారి విటాళిచందము
న్నిక్కము సన్నుతింప నేనీరజసంభవ కైనశక్యమే. 91

గీ. అప్పురంబున కధిపతి యై ధరిత్రి, పాలన మొనర్చె నాతపత్రము గను
భామినీజనమోహనపాదశ్రీఁ, మృదు తనుమేజయుఁడు జనమేజయుండు. 92

చ. ప్రతిదినముం బ్రభాతమునఁ బాకగితు విగతనిద్రుఁడై
శ్రితిసుకపాళితో నరిగి శంతఁ బోసంగెడి ... లో సమం
చితమతి నిత్యకృత్యము విశేషముఁ దీరిచి ... పంకజ
ప్రతతులఁ బూజసేయు నరపాలుఁడు కృష్ణు నభీష్టదైవమున్. 93

తే. ఆమహీపతి యొకనాఁ డపరాహ్ణంబు, నందు ... జాహ్నవిని నిత్య
కృత్యములు దీర్చి నగరికి వేగ నేంచి, కొలువుసింగారమై యంతు చెలువు మెఱసి.

సీ. నిండుకొల్వునను గూర్చుండ ధర్మజునోలఁ గావ్యము చెలిమెఁడి గౌరవంబు
దుర్యోధనాదు లాందోళ మొందఁగ విశ్వరూపంబు సూపెడు ప్రోల్లసనము
సంగరంబున ధనంజయరథస్థాయియై ధవళాశ్వములఁ బట్టుకొంట నెనము
వైరాటసూతి కాద్వారంబునను జక్రహస్తుఁడై గాఁచిన యట్టి మహిమ
తే. తెలియ శ్రీకృష్ణమూర్తిఁ జింతించినట్టి, కొలువుకూటంబులోపల నలువుమీఱ
భద్రపీఠికఁ గొలువుండెఁ బాండవాన్వ, యుండు జనమేజయక్ష్మాతలుండు.

వ. అయ్యవసరంబున. 96

తే. అధిక జిఱునవ్వు నవ్వి యమ్మునివరుండు, త్వారమణ యైహికాముష్మికంబు లింత సులభములె యైన వినిపింతుఁ దెలివిగాఁగ,నప్రమత్తుఁడవై విను మాదరమున.

ఆ. మేదినీశ వినుము "నాద త్తముపతిష్ఠ, తే" యనంగఁ గర్మదృఢత లేక యిహసుఖంబు గల్గునెట్లు "జ్ఞానాన్మోక్షః",మనఁగనజ్ఞుఁ డెట్టులందు ముక్తి. 106

క. గుణజలనిధిగహనా "క, ర్మణోగతి" యనంగ సులభమాకర్మము దా రుణము "శుకో ముక్తో" యని, గణుతింపఁగ నెటులు ముక్తిగల దన్యులకున్.

తే. కానఁ గర్మంబు లాత్మవిజ్ఞాన సరణి
దుర్లభములు విశేషించి దుష్టమైన
కలియుగమువేళ నెటువలెఁ గలుగు నైన
నొకయుపాయంబు దెల్పెద యుక్తముగను. 108

ఉ. కృష్ణదశావతారములు కేవలభక్తిని విన్నసజ్జనుల్
జిష్ణుసమానవైభవము జెంది యిహంబున నంతమీఁదట
వైష్ణవధామ మొందుదురు రవశ్యముదశ్యము నమ్ము రెంటికిన్
గృష్ణకులీన యన్న నృపకేసరి యంతయు సంతసంబునన్. 109

తే. పద్మనాభుండు పాండవపక్షపాతి, యందు నిక్కలి విజయునకనుఁగు గానఁ దత్కథల విందుఁ గృష్ణావతారపూర్వ,కముగ వినిపింపు మవతారకథల ననిన.

శా. శ్రీకల్యాణగుణంబుల న్నమతచేఁ జెన్నొందియు న్భక్తర క్షాకౌశల్యముఁ దెల్ప ధర్మసుతురాజ్యశ్రీయుతుం జేసి యం తే కుంతీసుతపక్షపాతి యనుకీర్తిస్ఫూర్తివర్తిల్లు నా శ్రీకృష్ణుండు కృపాకటాక్షమున రక్షించు న్బుధవ్రాతమున్. 111

సీ. ధరణీశ కృష్ణావతారంబు మున్నుగా వినిపింపు మని నన్ను వేఁడినాఁడ
వవతారములలోన నాకృష్ణచరితంబు గణియింతు రందు నొక్కటిగ బుధులు
బలభద్రుచరితంబు దెలిపినపిమ్మట నుపివెదఁ బదనుజన్మునిచరితము
మానసం బలరార మత్స్యకూర్మవరాహనారసింహాద్యవతారకథలు

తే. వినుము క్రమమున నీనులవిందుగాఁగ, నీసమంచితభక్తివర్ణింప వశమె తపముఫలియింపఁ జన్మంబు ధన్యమయ్యెఁ,గలిగె భాగ్యంబు శ్రీవిష్ణుకథలు దెలుప.

క. అని పులకాంకురములు మై, దనరఁగ మోదాశ్రులొలుకఁ దన్మయచిత్తం బున నలరుచు వైశంపా,యనముని దెలుపంగఁ దొడఁగె నధిపతి వినఁగన్. 113



# ౧. మత్స్యావతారకథ.

గీ. పంటవాల్గంటి నబ్బిగుబ్బలఁ జెలంగు, తళ్కుజిగిచిల్కపచ్చపిట్టతాళిఁ బోలి
పచ్చగండస పైరుల నిచ్చమెచ్చు, వెచ్చహెచ్చు గద్రావిడదేశ మధిప. 114

క. ఆదేశము సురపురవిభ, వాదేశము నృపతివితరణైశ్వర్యజిత
శ్రీదేశము కలుషానిల, కాదేశము నెగడుఁ బొగడ నలవియె యుందున్. 115

సీ. సతతంబు నభ్రంకషంబులై కనుపట్టు ధాన్యరాసులఁ జూచి తలఁకియేమొ
జపతపస్స్వాధ్యాయ చతురులై తగుమహీసురుల ధైర్యముఁ జూచి స్రుక్కియేమొ
పైఁబడి చాఁ టెఱుఁగక ప్రబలుద్రావిడవధూకుచకుంభములఁ జూచి కొంకియేమొ
యభవునియాజ్ఞ వింధ్యాద్రి మెట్టిన కుంభసంభవునాగతి జడిసియేమొ

తే. కాక భూపాలు దేవాలు కలుకువాలు, కఠినశిఖకోటిశతకోటిగాఁ దలంచె
నేమొ లేకున్న నచట మహీధరములు, పోఁక లంతైనఁ గొడసూపఁబోకయున్నె.

ఉ. సాలములో యనం బిగురసాలము లం బరిపాకలీల చే
రాలు మెఱుంగుముత్తియపురాలు ఖగంబులగుంపు దోలఁగా
యేలలుగంగ వానిఁగని యేలలువాడుదు రందు నవ్వగు
ల్బాళిఁగొనంగ శాలివనపాళికహాళికబాలికామణుల్. 117

ఉ. బాలరో పుష్పమంజరులపై భ్రమరంబులు వ్రాలె నవ్వగా
వ్రాలినచో నుపద్రవకరంబులు గావవి వాని మాన్పఁగా
నేలని నేర్పుమీఱ వచియింతురు పల్కులఁ దేనె లొల్కఁగా
హాలికబాలికామణు లుదంచితశాలివనాంతరంబులన్. 118

శా. శ్రీమద్ద్రావిడదేశవల్లభుఁడు లక్ష్మీనాథపాదాబ్జసే
వామాధ్వీకభ్రమరం బరాతినృపదీవ్యద్ధర్మకోటీరకో
టీముక్తాయిత వామపాదనఖకోటీజ్యోతి సత్యవ్రత
త్సామానిన్యధినాథుఁ డొప్పు క్షితిరక్షాదక్షకౌక్షేయుఁడై. 119

సీ. తనప్రతాపము సముద్దండశాత్రవకోటి గడిసీమఁ దోరణకట్టికొనఁగఁ
దనకీర్తి బహుసముద్రద్వీపములు దాఁటి చక్రవాళాద్రిపైఁ జౌకళింపఁ

దనకటాక్షము దిగంతరయాచకశ్రేణి రూఢికెక్కంగఁ గుబేరులనుజేయఁ
దనచీటి యష్టదిక్తటులేలు వేల్పు [1]రాజులపాగలం దురాచెల్వుచూప
తే. నతఁడు చెలువొందుఁ బరకిరీటాగ్రఖచిత, పాకభిన్నీలమౌక్తికపద్మరాగ
షట్పురణచక్రచక్రాంగచక్రవాళ, యుగపదాశ్రితపాదాబ్జయుగళుఁ డగుచు.
క. ఆసత్యవ్రతభూవర, శాసనుఁ డొకనాఁడు వేఁగుజామున ఘనగ
ర్జాసమసమధికవంది, శ్రీసూక్తుల మేలుకాంచి చిత్త మెలర్పన్. 121
క. హరి మదిఁ దలఁచుచుఁ బ్రాతః, కరణీయ చికీర్ష విబుధగణసంయుతుఁ డై
స్వరధిపనిభ వైభవభా, స్వరత న్ఘనవాహమెక్కి చనఁ జన నెదుటన్. 122
క. హేళికులాగ్రణి యగునృప, మౌళి గనుంగొనియె ధరణిమహిళాసుమనో
మాలిక పోలికఁ బగుకృత, మాలిక యనునదిని మదిఁ బ్రమద ముదయింపన్.
క. కనుఁగొని హరి పగి విబుధుల, రని కొనియాడుచును వింటిరా యీతటినిం
గనుఁగొను పుణ్యుఁడు మిక్కిలి, కనుఁగొను నెన్నుదుట నెన్నఁగాఁ దరమగునే.
క. కృతమాచరించు భూరిసు, కృతమానిన భాగ్యశాలికిం గలుగుం దు
ష్కృతమాలిక నడంపంగఁ, గృతమాలిక మునుఁగ దొరకునే యన్యులకున్.
తే. అనుచు ననుచు ముదంబున నంబుజాప్త, నిభవిభుఁడు మేదినీవిభుఁ డభిమతార్థ
దాయి తటినికిడిగ్గి హృత్తటిని భక్తి, పూర్ణతరముగ సంకల్పపూర్వకముగ. 126
క. మజ్జన మొనరించెను ధీ, మజ్జనను తులేసఁగ నృపతిమహి మహితముగా
మజ్జననము గావింపు న, మజ్జననీ తటిని యని సమంజసభక్తిన్. 127
తే. మజ్జన మొనర్చి యిటుల నమ్మనుజవిభుఁడు, కాల్యకరణీయములు దీర్చి గంధసింధు
రజసైంధవప్రథుహేమరథసుయోధు, లెలమి నలనంక వలవంక బలసికొలువ.
తే. నగరికేతెంచ నిట్టు లన్వహము తటినిఁ
గాల్యకరణీయములు దీర్చుకతన నతని
మదిని వైరాగ్యమొదవ సామ్రాజ్యతంత్ర
ములకుఁ దనమంత్రులనె స్వతంత్రులనుజేసి. 129
క. కృతమాలికాతటంబున, క్షితిపతి సలిలాశియగుచుఁ జేసె న్దపమా
శతమఖముఖబర్హిర్ముఖు, లతివిస్మయమంద మాఘవార్పితబుద్ధిన్. 130
క. ఒకనాఁ డుదయత్క్ష్మాభృ, న్మకుటస్ఫుటపద్మరాగమణినాఁ దిననా
యకుఁ డలరనృపతి మురభం, జకునకు నర్ఘ్యంబొసంగు సమయమునందున్.
క. సనుగరులు దళుకుమీసలు, మినుమినుకను కన్నుదోయి మిహిమంసనవుం
పసువుంగలయొకమీనము, దనయంజలిఁ దవుల నృపుఁ డుదకము న్విడిచెన్.
క తనునటుల నీటఁ ద్రోచిసఁ, గని మీనం బనియె రాజ కారుణికుఁడ వం
చును నిన్ను నమ్మి చేరితిఁ, జనునే నట్టేటఁ ద్రోయ శరణాగతులన్. 133

1 వేల్పువఱ్ఱెలపాగలఁ దురాచెల్వు.

సీ. శ్రీరామచంద్రుఁడు చేపట్టఁడా యునా శరణుఁజొచ్చిన విభీషణునిఁదొల్లి
శిబిచక్రవర్తి రక్షింపఁడే మును సన్నుఁ జేరినపక్షి దాక్షిణ్యగరిమ
నచ్ఛభల్లముఁ బ్రోవఁడా తొల్లి బెబ్బులిపాలుగాకుండ నృపాలసుతుఁడుఁ
దనశరీర మొసంగి వనచరునొక్కని దయగావదే కపోతంబు దొల్లఁ

తే. గాన శరణాగతులఁ బ్రోచుకంటెఁ బుణ్య, మేదిమేదినిలోన నన్నేది యింక
నాదిరాజన్యకర్తులఁ బ్రోది సేయు, ధర్మగుణసాంద్ర సత్యవ్రతక్షితీంద్ర. 134

క. సకలంబెఱిఁగినయాదిమ, శకులంబటులనిన రాజచంద్రుని చిత్తం
బకలంకమయ్యె నించుక, వికలముగా నిట్టులను సవిస్మయుఁడగుచున్. 135

మ. శరణన్న న్విడ సిన్ను నేను శఫరీ సామాన్యబుద్ధి న్నిరం
తరతం దోఁచితి వేళగాదు నిదియే తప్పంచు నీవెంచి ని
ష్ఠురతం బల్కితి పాడియే దెలుపుమిచ్చో నేభయంబయ్యె న
న్నరణోందం బనియేమి నావలన రక్షాసిద్ధి నీకెట్లగున్. 136

తే. అనుచుఁ బలికిన జనపతి మనుచు వేడ్కఁ
బెనుచు వాలుగ మేలుగాఁగనుచు ననిమి
షుదకమునఁ బత్తరింపుచు నున్న నన్నుఁ
జూచి భయమేమి యనుటగా చోద్య మయ్యె. 137

సీ. కూర్మికిఁ గూర్మి చేసులునె నోరికిఁజిక్క సెగడుమున్నె గడుపై సెగడుచుండ
మొసలికి మొసలియే కెసలఁ జేరఁగఁ బాదు సాముల బాములఁ బడుట కడిఁది
కర్కటిమర్కటగాదె పట్టినచోటు గప్పలు గొప్పలు గలవు మ్రింగ
బకము లంబకము లెప్పటికి మాపైసిల్పు మీలముచ్చులు ముచ్చులేల విడుచుఁ

ఆ. గన్నతల్లి కన్నఁ గరుణలే దొకవేళఁ, బట్టిపట్టెఁ దివియుఁ బార్థివేంద్ర
గండకముల కిట్టిగండము ల్గలపిఁకే, మనఁగవచ్చు నెట్లు మనఁగవచ్చు. 138

తే. అటులుగాన నిరంతర ప్రాప్తశైత్య, తరళతరవారిధార సాంద్రనలు సెయు
మీనుపిల్లల జన్మంబు మేలనంగఁ,బడున పరికింప విషములో బ్రతుకు గాదె.

క. కాన నిరుపద్రవంబగు, చో నను విడిపించి తేని సులభముగాఁ జే
కోనగు నాచంద్రార్కం, బై నసుకృత మసిన నృపతి యతివత్సలుఁడై. 140

తే. అధికనైష్ఠికవృత్తి మన్మథునిఁ గెలిచి, డలుగ్గాకొన్న జోళమండలవిభుండు
డాసి యున్నది యుదకమండలములోనఁ, గలఁకు మీనంబుఁ దనకమండలము సేర్చి.

సీ. తనయాశ్రమమున కల్లనఁ దెచ్చి రాజర్షి యల్లఘుఁ డాశ్రమమెల్లఁదేఱ
సతతపయోధారసమహార్చి భూమిలో నేఁటఁ బెంచినవారి బూఁట బెంచె
ననుమాట నిజముగా నెనరుతోఁ బోషింప శిశుకమారాత్రిలోఁ జిత్రముగను
మెండుగా బలిసి భూమండలాఖండఁ కొండిక కుండికనుండఁగూడ

తే. చింతనిర్బంధమైనచో సెటులనోర్తు, నింక నొండొకవిరివియౌ నెడవసింపఁ
జేయు మెందైన నందైన చింతవేఱ, విశ్రమించెద నన్నుఁ బృథ్వీవరుండు. 142

ఆ. గండకంబు వేలుకడ వసింపఁగఁజేయు, మన్నమాట గడవ కాతఁడంబ
కడువశంవదుండు గావున నొకగొప్ప, కడవలో వసింపఁగా నొనర్చె. 143

క. ఘటిఘటియించిన రెండవ, ఘటనే యండజము ఘటినిఁ గలయ బలిసియాం
ఘటమున నుండుటకుండు, ర్ఘటమై యున్నది యటంచుఁ గడుదీనంబై. 144

ఆ. మీన మడుగుటయును మేదినీంద్ర సతంస, మడుగులకును బ్రేమ మడుఁగుటేడుచు
నఖిలధీవరజన మడుగు గానఁగలేని, మడుగులోన నించ మహిమమించ 145

మ. మడుగు న్నిండఁగనిండి మండకమనుష్మత్స్యమండలాధీశ యి
క్కడ నుండం దరమే జడాశయము యోగ్యంబౌనె నావంటి యె
క్కుడురూపంబున మించువాని కిటఁ గాకోయ్య విస్తారమౌ
కడ సిల్వం గదవయ్య యా ర్తజనరక్షాదక్షదీక్షానిధీ. 146

క. నావుడుఁ గడువిస్మయమున, భూవరుఁ డొండొకప్రదేశము మదిఁదలఁచుచు
న్వేవిధముల నియ్యేతగు, నీవేళకటంచు నిశ్చయించి రయమునన్. 147

మ. అలరించె న్లవణాంబుధి న్మొదట నే యాకారశుద్ధోదకం
బులవార్ధి న్గడవైచె ధాత జడజోద్భూతుండురా యంచులో
కులు నిందింపఁగలంగి యన్నలువదిక్కూలంకషోర్మిచ్ఛటల్
గలయం బెజ్జలరాశిముందిడియెనాఁగా నొప్పు గాసారమున్. 148

తే. చేర్చి సుఖముండు మనిన రాజీవమనియు, సదయు రాజవతంసునిఁ సన్నుతింప
నల్ల రాజీవగర్భున కైనఁ దరమె, శ్రితనరాజవ ద్రవిడధాత్రీకళత్ర. 149

క. అని పొగడుచు నొకదినమున, ననిమిషకులచక్రవర్తి యాకాసారం
బును నాక్రమించి వేలుఁ, క్కనివాసముఁ జేర్చు నై వ్రగతివిహరింపన్. 150

మ. అనిన న్భావిభు డెండుచో టగునె మీనావాస మింకం దగు
న్ఘనఘుంఘుమానిలసంఘసంఘటితసంఘర్షాఖిలాశావిలం
ఘనజంఘాలతరంగరంగతలరంగత్పాండుడిండీరచం
దనసంది ప్తవిలాససముద్రము సముద్రంబే యటంచు న్మఁదన్. 151

క. జడరాశిం బడవైచిన, బిడుకుచు నప్పుడమిఁ జేని మీనంబనియె
న్గడనేఁటికి నేటికి డిగ, విడిచెదు నమ్మితిని గావవే దయమీఱన్. 152

ఆ. బాళిఁ జిలుకఁ బెంచి బాప్రరుగానికి, నొప్పగించుగతి నుచిత మగునె
యిన్ని నాళ్ళుఁ బ్రోచి యిప్పుడు జలరాశి, మొసలివాతఁ దోయ వసుమతీశ. 153

క. జలరాశిఁ దిమితిమింగిల, ములు నాఁదగుమీనసత్వములు వినలేదే
కలశైలసుతుండు జలచర, ములతో రావెడల నుమియు బునుకలతోడన్.

క. తాదృశమీనంబులు న, న్నే దెసవసియింపనిచ్చు నిటదిగవిడువం

గాదెసఁగినకారుణ్యము, నా దెసనుంపంగదయ్యవరనాథమణీ. 155

మ. అనిన న్నివ్వెఱఁగంది భూవిభుఁడు నాహా యిట్టిమీనంబులం
గనినామో వినినామొ యెందయిన లోకత్రాణపారీణుఁ డ
వ్వనజాతుం డిటుపంకిరూపమున సేవల్గాఁ బ్రసాదింపఁగాఁ
జనుదేఁ బోలు నటంచు నించుక మది న్సందేహముం జెందుచున్. 156

మ. పలరా టెక్కపుమీనవో సురలఁ బోఁవన్మించు మీనంబవో
తెలియ న్రానికి నైన నీబలిమి సందేహంబు నేఁగొల్పు న
జ్జలజాతుండవో ఫాలచక్షుఁడవో సాక్షాద్బ్రహ్మవో తెల్పు మీ
పలవంత ల్పచరింపనేల కుహనావైసారిణగ్రామణీ. 157

క. అన నేనేమీనముగా, ననఘాత్మ స్వభావమీన మని యెన్నుము నీ
యనుమానము మానుము నను, జనుమానముతోడఁ బ్రోవు జాగేమిటికిన్.

తే. విపధిలోపలఁ జాలరి వేటకాండ్ర, వలకుఁ జిక్కిన గాలంబు వంచికొనిన
గారవెట్టిన నేరీతిఁ గడపనేర్తు, నాకు గతి యొండుగలదె నా వరవరుండు. 159

తే. అనియు నీవు స్వభావమత్స్యంబ వైన, జాలరులు నిన్నుఁ బట్టంగఁజాల రెందు
నీయధీనంబు గాలంబు నీకు భయము, సేయనోపునె పరులకుఁ జేయునట్లు. 160

క. నీవలకుఁ జిక్కె లోకము, లీవల నీవలకుఁజిక్కుదేజలంబుల
న్నీవలకుం జిక్కుదుగా, కేవలనంగేలంబె యీ నీమహిమల్. 161

తే. పృథివి సంసారమన గారఁబెట్టఁజాలు, నీదుమాయావిలాసంబు నిఖిలజనుల
నంపజాలు నీవగతిగాక యన్యుఁడొకఁడు, నీకుగతి యొవ్వ సకలలోకైకనాథ.

క. యోజనలేక నీవు, ప్రయోజనయనమూర్తివే ప్రయోజనమున కీ
యోజ నటించెదు దినశత, యోజనమాత్రంబు వెరుఁగ నోపుదు చెపుమా.

శా. శ్రీనారీకుచకుంభికుంభయుగళాశ్లేషంబొ బ్రహ్మాదినా
నానాకేశనమస్క్రియావరమొ వీణాసూనిలోకాగ్రణ
గానాకర్ణనమో వధూనటనశృంగారావలోకంబొ యీ
మీనాకారము దాల్పనేమిపని స్వామీ నా కెఱింగింపవే. 164

సీ. కలిమిగుబ్బెతమిన్న గబ్బిబిబ్బరపుబ్బుగుబ్బలలో జక్కవగిబ్బజోడు
తెలిదమ్మివిరియింటి తెలిగంటికెంపువాతెఱసొంపు పవడంపుతీవగుంపు
లెడఁదకాఁపురపు పుత్తడిబొమ్మనిడువాలు గన్నులో యీవాలుఁ గన్నులరయ
ననవింటిదంటఁగన్న మిటారినూగారు తీరులో యీనాచుతీగగుమురు

తే. ఏల బ్రమసితి వీవార్ధి నేమిగంటి, తేలియాడెడు మీనంబు తెఱఁగుపూని
యూరక తెలియకయుంటిగా కయ్య నీమహత్త్వమెఱుగంగ శక్యమే యజునకైన.

క. నే నొక నెపమున నైనను, మానక నినుఁగొల్చినాఁడ మక్కువ నాపై
నూనుము "సఖ్యం సాప్తపదీనం" బని మున్ను విందు దీనశరణ్యా. 166

క. మునుపటిభవమున నేఁజే, సినపుణ్యమువలన మిమ్ము సేవింపఁగఁ గం
టిని మాయలేటి కింకిట, వినిపింపఁ గదయ్య నీదువృత్తాంతంబున్. 167

మ. అనినం గైతవమత్స్యమూర్తి [1]కరుణాయత్తైకచిత్తంబుమీ
ఱ ననున్మ్లావర యాత్మతత్త్వము పరబ్రహ్మంబుగా నెమ్మనం
బునఁ జింతింపుము సంశయింప కిఁక నేమో యంచు నీచక్కఁగే
నను మోదించి యనుగ్రహించితి నభీష్టార్థంబు నీకయ్యెడున్. 168

సీ. వినుము సత్యవ్రత వినయగుణాన్విత భావికార్యము తేటపఱుతు నీవు
కనుఁగొనుచుండు మింకను నేఁడు మొదలుగా నేడుదినంబుల కిప్పయోధి
భువనముల్ త్రిభువనంబులను లోఁగొను నేలనన్న నానాఁటికి నబ్జభవుని
రేయైన నతఁడు నిద్రించుఁ గావున దాని కెడఁద భయంపక నెనయు నప్పు
తే. డోషధీబీజరాసుల యోడనీకు, నంపుచున్నాఁడ నోడక యందు సప్త
ఋషులతోఁగూడి వసియింపు మెపుడు నాదు, భక్తజనమున కెందు నాపదలు లేవు.

తే. అనుచు నానతియిచ్చి మాయావిసార
మూర్తి యంతర్హితుండైన మ్రొక్కి నృపతి
యెంత దయగలవాఁడు సర్వేశ్వరుండొ
హో యటంచును నిష్ఠతో నుండు నంత. 170

సీ. ప్రథితసుమేధుఁడై పరగుసుమేధుండు విరజుఁడై శాంతిచే వెలయు విరజుఁ
డాభాహవిష్మంతుఁ డగుహవిష్మంతుండు నుత్తముఁడైనట్టి యుత్తముండు
వనజాక్షుపరభక్తవనమునుండగు మధుం డఘపారవమహాగ్ని యైనయగ్ని
ద్వంద్వసహిష్ణుఁడై తగిన సహిష్ణుండు ననఁదగు సప్తర్షు లమితహర్షు
తే. లగుచు వచ్చిరి లవణమహాంబురాశి, వేల నర్భశయానుఁడై విభుఖగేశ
యాను నతివేలభక్తిభాగనఘుజనకు, పాలు హరిఁగొల్చు ద్రవిడనృపాలుకడకు

ఆ. అట్టు లరుగుదెంచి నట్టియయ్యతులకు, నతులగతుల మతులు నతులు చేసి
యతివినీతి నున్న క్షితితలపతిధృతి, మతిని మెచ్చికొనుచు మౌను లనిరి. 172

క. శతవర్షంబుల నుండియు, క్షితి వర్షము లేని కతన శిథిలంబగుఁ జో
నతివృష్టిమించె జలనిధి, గతి దృష్టించితివె ముజ్జగంబులు ముంచున్. 173
తే. ఇందు నెవ్వరిఁ గనుఁగొన విజ్జగంబు, నందు నాశ్చర్యమయ్యెనో యవనినాథ
యేకతంబున వారాశి సైకతమున, నేకతంబున నున్నాఁడ వెఱుఁగఁ జెపుమ.

ఉ. నావిని తావినీతి జననాయకుఁ డిట్లను మౌనులార రా
జీవముకుందు మున్న నను చిత్రముగా భ్రమియించి యంతటన్
భావికథల్ వివిస్తరతఁ బల్కి పయోధి మునుంగకుండ నే
నావ ఘటింతు నీకు మునినాథులతో వసియింపు మత్తరిన్. 175

---

1 కరుణైకాయత్తచిత్తంబు.

తే. అంచు ననుమించు వేడుక నానతిచ్చి, గోచర మగోచరంబైనఁ గొంతధైర్య
శాలివై యుంటిఁ దన్ని దర్శనముఁ గోరి, నేఁడుమీదర్శనమున సందియముదీఱె.

మ. అనిన న్నంతనమూని మౌనిజను లాహా యింక నెట్లో కదా
వనధు ల్ముంపఁగఁ జొగె ముజ్జగము లేవంక న్వసింపంగవ
చ్చునటంచుం గడుఁద త్తఱించినతఱిం జోద్యంబుగా నీడకుం
జనుదెంచుం బరియంచుఁ బల్కుచుఁ బరుంపన్వచ్చు నిచ్చోన్నృపా. 177

క. అనిపలుకుచు నుండఁగ న, వ్వనినిధిఘనఘోషమడఁగ వలమానతరం
గనికాయంబులఁ బొదువఁగఁ, గనికాయంబదర లేచి గ్రక్కునవారల్. 178

సీ. పటుకీర్ణతరజటాపటలంబు ముడివీడి కన్నులకడ్డమై గప్పికొనఁగ
భయవేగసంచలత్పాణిపరిస్ఫుటస్ఫటికాక్షమాలిక ల్జాఱిపడఁగఁ
గాషాయపటములు గటితటంబుల నూడి త్రొక్కుడుపాటుచేఁ దునియుచుండఁ
జాలినొందుచు నెత్తఁజాలక వచ్చుచో ఘనకమండలువు లక్కడనె చిక్క

తే. జడిమ నడుగులు దడఁబడ నుదుట నార్పు
లడర బడిబడి బడలిక లొదలఁ బొగమఁ
గడలికడనుండిమగిడి క్రేఁగంటి దృష్టి
నిడుచుఁ బొలుచు జడదారి యొడయ లపుడు. 179

శా. "అస్మాన్ పాహి భయాతురాం స్త్రిజగతీమాప్లావయద్వారిధి
ర్విస్తార్యా నఖిలు త్వయాంబుయ నితో విష్ణో భవాన్ రక్షకః
తస్మా త్త్వాం శరణంగతా అనితికా ఘావంత ప తేభ్యశ్శం
కస్మాదేవ ముపేక్షసే" యని మును ల్గార్పణ్య మేపారఁగన్. 180

తే. మొఱలు పెట్టుచు శరనిధి మఱలిమఱలి
కాంచుచో నిపె యోడని కదియఁ జనుచుఁ
దెలియ వీక్షించి యదిగాదు జలముగ్రోలు
జలద మిది యని మదిలోన జలగరింప. 181

మహాస్రగ్ధర. కని యమ్మాభపాలుఁ డంత న్ఘనతరసముదగ్రస్వకీయాగ్రభిద్య
ద్వనరుద్ధబ్రహ్మాండభాండావరణపరిపతద్వారిధారాలి శంకా
జనకాసంఖ్యాతసూత్రోజ్జ్వలపృథుగుణవృక్షచ్ఛటాకించిదాకం
పనలీలాకృష్ణభస్వత్పటకటపటలప్రస్ఫుటం బైన నావన్. 182

క. కని యిట్లను మునులారా, కనుఁగొంటిరె దివ్యరత్నకమనీయంబై
కనకన వెలుఁగుచు నిదిగోఁ, గనరయ్యెం గనకతరణి గరుడధ్వజమున్. 183

క. అనునంతలోన దరికిం, జనుదెంచిన యత్తఱిన్ ససంభ్రమముగ న
మ్మునినాథు లెక్కి రొండొరు, లనువడిఁ జేయూఁతగా హాహాహాళిమీఱన్. 184

తే. ఎక్కి ఘనలను కరిసేర్ప నీశ్వరునికై, భారమవుఁగాన దరిసేర్చె నావ యనుచు
విడిచి కాషాయవస్త్రము వ్రేట్టువిసరు, గాలినెండించుకొనుచు నాకలమునందు.

సీ. కలధౌతసర్మితోజ్జ్వలశిరోగృహములు దీపితమాణిక్యదీపతతులు
రమణీయవైడూర్యరచితపర్యంకముల్ సౌవర్ణమణిమయజాలకములు
పృథులగోమేధికపీఠికాపేటిక లకలంకనవవజ్రముకురసమితి
మానితముక్తావితానవితాన మాయాకపుష్పరాగభద్రాసనములు

తే. విద్రుమస్తంభములు నీలవేదు లమర
గాంగజలపూర్ణ ఘనకాచఘటచయంబు
విత్తనము లోషధులుఁ బక్కువివిధవస్తు
జాలములు సూచిసూచి యాశ్చర్యమునను. 186

శా. ఓహో కంటిరె వారిరాశిసలిలం బుద్వేలమై శైలసం
దోహాగంబులు పక్కఁ దక్కిన పురాదు ల్ముంచె నందు నృప
వ్యాహార్యాగ్రమె కాని కాన మితరం బాహా విమానస్వయం
గ్రాహగ్రాహము లెచ్చరించెనుభువఃక్రాంతిక్ష విజృంభించుచున్. 187

తే. తరణి మెఱుఁగారు గారుడధ్వజము గాంచి
కలఁగి పరువిడుఁబలు నపగ్గములు సరలి
పఱచుహయములసారథి పట్టలేమిఁ
దత్తరించుచునున్నది తరణిగనము. 188

తే. ఔర సకలంకమైనట్టి యబ్జమండ, లమునసంగాబ్జమండలభ్రమ సడంగి
జలధిఁబలకరితుండంబు సాచి తివియు, నేమనఁగవచ్చు మత్తుల కెఱుక గలదె.

క. మహిజనులఁ బీడఁ బెట్టకు, గ్రహములఁ బీడింపఁదొడఁగె గ్రాహము లివిగో
సహజ మగున త్త్వసంపద, నహహా యాకాశవృద్ధి నధికము లగుటన్. 190

తే. నూయురే తోయనిధిలోన మకరమీన, కర్కటకరాసులొంటఁ బొండఁగగనమకర
మీనకర్కటరాసుల నించువేడ్కఁ, గౌఁగిలించె సజాతియగౌరవమున. 191

తే. అదరిపాటున వారాశినుదుటు సూచి
మిగులభయమునఁ బమతము మెఱుఁగుబోండ్లు
చేరి తముఁదామె కౌఁగిటఁ జేర్చ సౌఖ్య
వార్ధిఁదేలె మహర్లోకవాసి జనము. 192

తే. ఇదియు గనుఁగొంటిరే చిత్ర మిట్టివేళ, శైవమఘజాగ్రశూలాగ్రభాసికాశి
కానఁ గానయ్యె మోక్షలక్ష్మీనివాస, నాళసమ్మైశితారవిందమ్మురీతి. 193

శా. ఆశాలంఘనజాంఘికోజ్జ్వలతరంగాభంగనానాపయో
రాశివ్యాపృతవిష్టపత్రయచతుర్వక్త్రీయనక్తంబున

న్నాశంబొందక తేజరిల్లె సకలాన్నత్యంబు సూచించుచున్
గాశీపట్టణవైభవంబుఁ బొగడంగా శక్యమే యేరికిన్. 194

క. అని యొండొరులు వచించుచుఁ, గనఁగ మహర్లోకమవధిగా నీచందం
బున ముజ్జగములు దనలోఁ, గొనుచు న్వారిఁ బోలు నయ్యకూపారమునన్.

సీ. వడి నీరువడిఁ జిక్కువడి చక్రవాళాద్రి క్షణమాత్రమునఁ బ్రదక్షిణము సేయు
నతిరయస్ఫూర్తిచే నరుగుచో నాడాడ నగశృంగములు ఘణిల్లనఁగఁ దాఁకు
ఘనవర్తులావర్తగర్తభాగముల దిర్దిగను గుమ్మరసారెరీతిఁ దిరుగు
శతయోజనాయతోన్నతమహాపాఠీనసంఘ సంఘటితఘర్షమున నదరు

తే. జలధి యుల్లోలకల్లోలములను దగిలి, యట్టె యెగయుచు డిగుచును బొట్టిపిట్ట
పగిది మెలఁగెడునావలోపల వసింప, భయపడుచునుండునంతలోపల నెదుట.

సీ. తనభయంకరవాల వినిపాత మమరేంద్రకరవాలహతి యంచు గిరులు వడఁకఁ
దనమస్తకోర్ధ్వరంధ్రవినిస్రుతాంబువు ల్పునరుత్పతద్గంగపోలుపు దెలుపఁ
దనవక్త్రబిలము సొచ్చినను హాతిమితిమింగిలతద్గిలంబు లంగిటను వెడలఁ
దనపార్శ్వభాగసంఘర్షణంబున ద్వీపకోటులు నుగ్గులై నీటఁ గలయఁ

తే. దనమహోద్దండనాసికాదండమునను, ఖండఖండంబులై యహిగ్రాహకమఠ
కర్కటీ నక్రముఖజంతు కాండ మగల, జలధివిహరించు నొక్కమత్స్యంబుఁ గనిరి.

చ. కని యిది యేమి యద్భుత మొకానొకనాఁడును జూడ మిట్టిదే
వనచర మింక దీనికున వాలము సోఁకిన నంతఁ దున్కలై
చను గిరులైన నీతరణిచందము నెన్నఁగ నేల యంచు నె
మ్మనము గలంగి చూచుతఱి మానవనాథుఁడు వారి కిట్లనున్. 198

క. ఓహో భయపడ నేటికి, నూహించితి నాఁటియంబరోత్తమ మిది సం
దేహింపకుండి మనకుఁ, సాహాయ్య మొనర్ప వచ్చె జలనిధి ననినన్. 199

తే. మానివరు లిట్టులనిరి యోమానవేంద్ర, నీవు సేసినభక్తి కెంతేని మెచ్చి
సకలవేదాంతములకు గోచరము గాని, యాశ్రితత్వంబు గోచరమయ్యె నిపుడు.

క. నన్నుఁ గూడి తుంగ పలుకె, క్కనదిఫమున నిన్నుఁ గూడి కేశవమూర్తి
న్గనుఁగొంటి మింక నీహరి, వినుతింపుమటన్న ధరణివిభుఁ డుత్సుకుఁడై. 201

క. చూచితిరే శ్రీహరిమా, యాచాతురి హేమమీనమై జలధిచల
ద్వీచీడోలాకేళీ, వైచిత్రిం జెలఁగు ప్రాభవము మునులారా. 202

. అంభోధివరుఁడు వియన్నదీకన్యకఁ బైనించుముత్తెలప్రాలనంగ
వైమానికాంగనామంతముల బొల్చు సోగ ప్రఁప్పుఁ జేరుచుక్కలనఁగ
గగనలక్ష్మీవేణికాభాగమును గ్రంథనిగ్గు క్రొవ్విరిజాడమొగ్గ లనఁగ
నభిమతవిజయయాత్రారంభమున దిశాలనామణులు జల్లులాజ లనఁగఁ

